# వైశ్య ప్రబోధిని

తెలుగు మాస పత్రిక

శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి దేవి




ఆగస్టు 1996

|  |  | Frequency | Fare |
|---|---|---|---|
| 1 | Delhi-Shimla-Kulu-Manali-Chandigarh-Delhi | Every Friday | 2,000 |
| 2 | Delhi-Agra-Jaipur-Delhi | Every Monday | 500 |
| 3 | Delhi-Mussoorie-Haridwar-Rishikesh-Delhi | Every Friday | 400 |
| 4 | Delhi-Mathura-Brindavan-Agra-Allahabad-Varanasi-Saranath-Gaya-Budha Gaya-Lucknow-Ayodhya-Naimisaranya-Delhi | Every Friday | 1,900 |

Fare includes complimentary Dormitary accommodation and transport/ Guide charges. Tariff for Tour No.4, is inclusive of food also enroute, except at Delhi. We are running LTC tours for Central Government employees in collaboration with ITDC. All tours are by Super Deluxe buses, starting from our New Delhi office. Contact our offices for advance reservations.

మీరు ఢిల్లీ వచ్చినపుడు అధునాతన సౌకర్యములతో నిర్మింపబడిన మా "హోటల్ సదరన్"లో బసచేయండి. ఢిల్లీలో మా హోటల్ లోని అమరావతి/ సుప్రభాత్ రెస్టారెంట్లలో రుచికరమైన తెలుగు భోజనం, అరిశెలు, బందరు లడ్డు, బూంది, వెగోడీలు, మొదలగు తీపి/కారం పదార్థములు కూడా లభించును.

*Our Super Deluxe Video buses & tourist cars are available on contract for tourists. Our recipts are approved for LFC purposes.*

***Air/Rail Reservations are also undertaken.***

**for more details, please contact**

**Southern Travels [illegible]**

**18/2, Arya Samaj Road, [illegible]**

**New Delhi - [illegible]**

**(Phones : 5722210 (6 Lines) [illegible])**

## Our branches

1 Hotel Ayodhya Building, Lakdi-ka-pool, Hyderabad - 500 004. (Phones : 223658; 227233)

2 Hotel Raj Kamal Complex, Near Shivananda Stores, Kumara Park East, Bangalore - 560 001 (Phones : 2267040; 2262633)

3 Hotel Howrah Complex, Opp. Madras Central Railway Station, Madras - 600 003 (Phones : 564864; 585253)

4 No.10, Swarnalok Complex, Opp. Apsara Theatre, Eluru Road, Governorpet, Vijayawada - 520 002 (Phones : 62227, 66624)

5 Pavan Palace, Ground Floor, Opp. T.S.R. Complex, Dwarakanagar, Visakhapatnam - 530 016. (Phone : 545565, 541099)

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం    స్థాపితం : 1961    బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం

✆ : 52262 ప్రకాశం జిల్లా.    ✆ : 87158 (S.T.D. 08524) కర్నూలు జిల్లా.

అతి పవిత్రమైన జ్యోతిర్లింగములలో రెండవది అయిన శ్రీశైలం మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన పవర్ డ్యామ్, ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడుచున్నందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63న తేదిన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం. దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 109 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినమునను, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకు జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భమునను వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు :</u> ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరులో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకుల "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫోటో సత్రం ఆఫీసు యందు బిగించబడును.

రు.1160-00లు ఇచ్చిన దాతలు ఈసత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతియొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించు చున్నాము.

**పోలిశెట్టి సత్యనారాయణ**    **యక్కలి బాలరత్నం**

అధ్యక్షులు    మరియు కార్యవర్గ సభ్యులు    ప్రధాన కార్యదర్శి

# వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



**స్థాపితము**

1969



**సంపుటి**

27



**సంచిక**

12



ఆగస్టు - 1996



సంపాదకులు :

'సంఘోద్ధారక'

'వైశ్యభూషణ'

పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :

ఫోన్ : 25025,

24911

వైశ్య ప్రబోధినీ

కార్యాలయం

"వాసవీ భవన్"

జయనగర్ కాలనీ,

విద్యామందిర్

తూర్పు భాగం

కడప - 516 002.


సంపాదకీయం

## సానుభూతిని కోల్పోవడమే

ఎంట్రీ ట్యాక్సునూ, టర్నోవర్ ట్యాక్సునూ - తిరిగి ప్రవేశపెట్టూ రాష్ట్ర ప్రభుత్వం ఆర్డినెన్సును జారీ చేసింది. ఎంట్రీ ట్యాక్సును ఇంతకు ముందు ఒక దఫా అప్పటి రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశపెట్టూ చట్టాలు చేయడము చాలా మందికి తెలుసు. రాష్ట్రములోని సర్వ వర్తకులూ 'ఎంట్రీట్యాక్సు' విధింపును గట్టిగా వ్యతిరేకించారు. స్వర్గీయ యన్టీ రామారావు గారు వర్తకులు ప్రదర్శించిన ఆ వ్యతిరేకతకు మద్దతు నిచ్చి వర్తక సానుభూతిని ఘనంగా పొందారు. వర్తకులు 'ఎంట్రీట్యాక్సు' విధింపుకు వ్యతిరేకంగా సాగించిన ఉద్యమములో తెలుగు దేశం పార్టీ కూడ చేతులు కలిపింది. అప్పటి కాంగ్రెసు ప్రభుత్వాన్ని ఈ పన్ను విధింపును దృష్టిలో పెట్టుకొని తెలుగుదేశం పార్టీ వారు విమర్శించారు. స్వర్గీయ యన్టీఆర్ తిరిగి 'తఖితు' మీదకు రాగానే సర్వ వర్తకుల కోర్కెను మన్నిస్తూ, ఎంట్రీట్యాక్సును రద్దు చేశారు.

టర్నోవరు ట్యాక్సు కూడ ఇంతే. ఇంత ముందు ఈ రాష్ట్రములో అమలులో ఉన్నదే. స్వర్గీయ యన్టీఆర్ తిరిగి ప్రధాన సచివులు అయిన తర్వాత ఇప్పడు అమలులో ఉన్న సాధారణ అమ్మకం పన్ను చట్టాన్ని సవరిస్తూ చేసిన శాసనము ద్వారా టర్నోవర్ ట్యాక్సు విధింపును రద్దు చేశారు.

ఏ తెలుగుదేశం ప్రభుత్వమైతే ఈ రెండు పన్నులనూ రద్దు చేసిందో అదే తెలుగుదేశం ప్రభుత్వము కేవలము రెండు సంవత్సరాల కాలంలోనే తిరిగి వాటిని ప్రవేశ పెట్టడంలోగల ఔచిత్యము ప్రశ్నార్థకమైంది.

ఏ పార్టీ అధికారంలోకి వస్తే తమ సమస్యలు తీరుతాయనీ, సమర్థనీయమైన తమ కోర్కెలకు న్యాయం కలుగుతుంది అనీ విశ్వసించి, ఆ పార్టీ

విజయానికి కారణభూతులయ్యారు. ఆ వర్తకులకే గుదిబండగా తయారయ్యే ఈ ట్యాక్సు విధించడము వల్ల రాష్ట్ర ప్రభుత్వము తిరిగి వర్తకుల సానుభూతిని కోల్పోయే పరిస్థితి వచ్చింది.

పన్ను విధింపు పలు రకాలుగా ఉండడము వల్ల ఆచరణలో అనేక ఇబ్బందులు కలుగుచూ ఉన్నాయి. అవినీతిపరులైన అధికారులు కొందరికి ఇటువంటి పన్నుల విధానము జేబులు నింపేందుకు తోడ్పడుతూంది. రాష్ట్రంలో జరుగు వ్యాపారముపై వివిధ దశల్లో పన్ను విధింపు జరగడం వల్ల సామాన్య, మధ్యతరగతి వర్తకులకు కష్టతరమౌతుంది. ఇప్పుడు వివిధ వస్తువులపై రాష్ట్రములోని మొదటి దశలో జరుగు అమ్మకంపై విధిస్తున్న పన్ను శాతాన్ని మరింతగా పెంచి, ప్రభుత్వం ఆశిస్తున్న ఆదాయాన్ని అమ్మకంపన్ను ద్వారా సమకూర్చుకోమని వర్తక సంఘాల ప్రతినిధులు అనేకసార్లుగా ప్రభుత్వాన్ని కోరారు. సమంజసమైన ఈ కోర్కెను అమలులో పెట్టుటకు రాష్ట్ర ప్రభుత్వం ఎందుకు ఆలోచించడము లేదో? తెలియకున్నది.

"పన్నులశాతం హెచ్చుగా ఉండడమూ, పన్నుల విధింపు పలు రకాలుగా ఉండటంవల్ల ఎగవేతకు ఎక్కువ ఆస్కారం ఉంటుంది" అని అనేక మంది ఆర్థిక శాస్త్ర నిపుణులు అనేకసార్లు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల దృష్టికి తెచ్చారు. అందుకు ఉదాహరణ 'వ్యాట్'. ఈ వ్యాట్ విధింపుపై కూడ వర్తక సంఘాలు తమ అసంతృప్తినీ, వ్యతిరేకతనూ ప్రకటించాయి. ప్రతిష్టకు పోయిన ఇప్పటి రాష్ట్ర ప్రభుత్వం అందుకు అంగీకరించక అమలులో పెట్టింది. 'వ్యాట్' వచ్చిన తర్వాత తమ వద్ద కొన్న సరుకులకు బిల్లులు ఇచ్చే వర్తకుల సంఖ్య బాగా తగ్గింది. ప్రభుత్వం ఆశించిన రీతిలో ఆదాయమూ రాలేదు.

ఎగవేతకు వీలు కలుగని రీతిగా, అమ్మకం పన్ను శాఖాధికారులు తమకు ఇష్టం వచ్చిన రీతిగా నిర్వచించి వర్తకులను వేధించుటకు వీలులేని విధంగా పన్ను చెల్లింపును వర్తకుడు ఉత్సాహంగా, సులువుగా జరుపునట్లుగా రాష్ట్రములో ఇప్పుడు అమలులో ఉన్న అమ్మకం పన్ను చట్టాన్ని సవరించేందుకు ఇప్పటి ముఖ్యమంత్రి ప్రయత్నించి ఉంటే అభినందనీయులయ్యే వారు.

"రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక దుస్థితిని చక్కపరచి, ఆంధ్రప్రదేశ్‌ను మరింత ముందుకు తీసుకపోయేందుకే ఈ పన్నుల వడ్డింపు" అంటున్న ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు, రాష్ట్ర ప్రభుత్వం నిర్వహణలో జరుగుచున్న దుబారాను, అట్లే ప్రణాళికేతర వ్యయాన్ని సహేతుకంగా పరిశీలించగలిగి ఉంటే ఈ పన్నులను సరిక్రొత్తగా వేయుటకు కానీ, ఉన్న పన్నుల శాతాన్ని పెంచుటకు గానీ అవసరం ఉండదు. ఏమైనా, ఈ ప్రభుత్వం వర్తకుల సానుభూతిని మరోసారి కోల్పోయింది.

## వైశ్య వైజయంతిక

(సాదా ప్రతి రూ. 100/- లు) (గ్రంథాలయ ప్రతి రూ. 120/- లు)

"వైశ్య వైజయంతిక'

వైశ్యప్రబోధిని వైశ్యసమాజానికి 25 సంవత్సరాలుగా చేసిన అకుంఠిత, అసామాన్య, అప్రతిహత, అకలంక, అక్షర రూపసేవకు చిరస్మరణీయ చిహ్నము

వైశ్యులకు సంబంధించిన ఒక 'రెఫరెన్సు'. గతానికీ, వర్తమానానికీ వారధి. ప్రతి ఒక్కరూ తప్పక చదువవలసింది. ప్రతి వైశ్యుని ఇంట్లో తప్పక ఉండవలసింది.

జగజ్జనని శ్రీ వాసవీ దేవి ప్రామాణిక రూప ముఖ చిత్రముతో, రమ్యమైన ఆకృతిలో ముత్యాల వంటి ముద్దులు కొలిపే అక్షరాలతో,

వెలువడ్డ సంచిక

ఇప్పుడు లభిస్తుంది 'రడీ'గా

మూల్యము రూ. 100/-లే. తపాలా ఖర్చుతో కలిసి

వైశ్యప్రబోధినీ పబ్లికేషన్సు - వైశ్యప్రబోధినీ కార్యాలయం, వాసవీ భవనము, జయ నగర కాలనీ, కడప - 516002. కు, రూ. 100/-లు య.ఓ. లేక డి.డి. ద్వారా పంపి పొందవచ్చు.

ప్రతులు కొంచమే. త్వరపడాలి.

లైన్. కె.వి. గోవిందరావుగారు ఏమంటున్నారు.

ఈ సంచికను ఉద్దేశించి,

సుందరంగా, సొగసుగా, ముద్రితమైన వైశ్యప్రబోధినీ రజతోత్సవ సంచికను పూర్తిగా చదివాను.. చాలా విలువైన పరిశోధనాంశాలు గల ఈ సంచిక భావితరాలకోసం విధిగా భద్రపరచు కోవలసింది. చాలా విలువైన సంచిక. ఈ సంచికలోని వ్యాసాలు చదువవలసినవి. మరీ, మరీ చదువవలసినవి. పుత్ర, పౌత్రాదులు లాభము పొందుటకు పదిలపరచు కోవలసిన అనేక విషయాలు గల అమూల్య సంచిక. ఇందలి వ్యాసాలను చదివిన వారు ప్రతిఫలంగా మంచి విజ్ఞానాన్ని పొందుతారు. అందువలన, ఈ సంచికను మద్రాసు మౌంట్ రోడ్డులోని 'కాస్మొ పొలిటిన్ క్లబ్బు' లైబ్రరీకి బహూకరించాను.

మద్రాసు నగరములోనూ, వెలుపలనూ 3500 మంది విలువైన సభ్యులు గల పురాతనమైన క్లబ్బు 'కాస్మొపొలిటిన్ క్లబ్బు'

లైన్ గోవిందరావు అంటే?

అంతర్జాతీయ స్థాయి, అతిప్రసిద్ధి పొందిన విజ్‌డమ్ పత్రికా వ్యవస్థాపకులూ, సంపాదకులూ.' లక్షలాది ప్రతులు సర్క్యులేషన్ గల పత్రిక విజ్‌డమ్. 'విజ్‌డమ్' ద్వారా రావు గారు విజ్ఞానాన్ని అందిస్తున్నారు సరళమైన శైలిలో రావుగారు మానవతావాదులు. ప్రతి యేడూ రెండు లక్షలకు పైబడి మానవసేవకు వెచ్చిస్తున్న కరుణా హృదయులు.

# 'అవచి' ధర్మనిష్ఠ

– సంపాదకులు

క్రీస్తుశకం 1327. అంతకు నాలుగేండ్లు ముందు కాకతీయ ప్రతాప రుద్రదేవ చక్రవర్తిని-ఢిల్లీ పాదుషా సేనలు బందీగా తీసుకవెళ్ళాయి. ఆంధ్రభూమి యవనుల వశమైంది. తురుష్క భటులు విజృంభించారు. ప్రజల ఆస్తులను కొల్లగొడ్తున్నారు. భూసురుల గృహాల్లో నిత్యాగ్ని హోత్రాలు చల్లారి పోయాయి. వారి ఇండ్లనుండి సామగానాలు వినిపించటం లేదు. సుక్షత్రియుల బాహువులు సారహీనములయ్యాయి. శ్రీమంతులగు వైశ్యుల సంపదలు భూమాత ఒడిలో దాగినవి భూభారమంతా పుణ్యపురుషులగు శూద్రుల భుజస్కంధాలపై నిలిచింది. యావదాంధ్రములోని ప్రజలూ తమ ప్రాణాలను గుప్పిళ్ళలో ఉంచుకొని జీవిస్తున్నారు.పరిస్థితి ఇట్లే మరికొంతకాలం సాగితే ఒకనాటి ఆంధ్రవైభవ ప్రాభవాలకు ఆనవాలు కూడ మిగులవు. అప్పటి ఆంధ్రదేశ దుర్భర, దుస్థితిని అవచి దేవయ శ్రేష్ఠికి కండ్లకు కట్టినట్లుగా వివరించారు ఆయన వేగులూ. దేశ విదేశాల్లలో ఈ వర్తకాన్ని సాగిస్తున్న ఆయన వర్తక ప్రతినిధులూ. ఆ మాటలు అవచి దేవయ శ్రేష్ఠి హృదయాన్ని కలత పెట్టాయి. ఒకనాటి ఆంధ్రదేశ వైభవాన్ని, ప్రాభవాన్ని, ప్రతాపాన్ని కథలు, కథలుగా చెప్పగా విన్న ఆయనకు ఆ వార్తలు అనంత విచారాన్ని కలిగించాయి.

అవచి దేవయ పూర్వులది విక్రమ సింహపురి. అంటే ఇప్పటి నెల్లూరు. అవచి కాలం నాటికి వారి వ్యాపారం శాఖోపశాఖలుగా విస్తరిల్లింది. భారత దేశంలోనే కాక విదేశాలలో సైతం ఆయన వ్యాపారాన్ని భారీగా సాగిస్తున్నారు. ఈ కథా కాలంనాటికి అవచి దేవయ కంచీ పట్టణములో స్థిరపడి ఆ పట్టణాన్నే తన వ్యాపారానికి కేంద్రంగా జేసుకొని, తన వ్యాపారాన్ని పర్యవేక్షిస్తున్నారు. అవచి వాణి సెట్టి వంశీయుడు. కౌండిన్య సగోత్రజుడు. 'జనని అన్నా, జన్మభూమి అన్నా స్వర్గానికన్నా మిన్న' అను మాటలను ఎఱిగిన అవచికి తన వేగులూ, వర్తక ప్రతినిధులూ తెచ్చిన ఆ వార్తలకు కన్నులనిండా నీళ్ళు తిరిగాయి. తన మాతృభూమిని యవన నిర్మూలనం జేసి తిరిగి మునుపటికి స్థితిని కల్పించుటకు తనవంతుగా చేయాల్సిందేమి?అని ఆలోచిస్తున్నాడు.

సప్త సముద్రాల మీదుగా సాగుచున్న తన వర్తకాన్ని ఒకసారి పరిశీలించాడు. శ్రీ విషయము, మలయము, యవ

ద్వీపము, సువర్ణ ద్వీపము, బలి ద్వీపములలోని ఆయన వర్తకము మునుపటి స్థితిలో లేదు. బాగా తగ్గిపోయింది. ఈ ద్వీపాలకు వెళ్ళాలంటే విక్రమ సింహపురి మీదుగా వెళ్ళాల్సిందే.

విక్రమ సింహపురి ఆంధ్రభూమిలో నున్న ప్రధాన వర్తక కేంద్రము. యవనుల విజృంభణం వలన ఆంధ్రభూమి అల్లకల్లోలంగా ఉంది. వర్తకానికి తగిన రక్షణ లభించడము లేదు.

అవచి దేవయ గొప్ప శ్రీమంతుడు. ఆనాటి భారతావనిలో గల వర్తక శ్రేష్ఠులందరిలో గొప్పవాడు. రథాలు, గజాలు, గుఱ్ఱాలు, పదాతి దళాలు ఆయనకు ఉన్నవి. ఛత్రచామరాది రాజ లాంఛనాలను గలవాడు. నీటి మీద, భూతలంమీద యుద్ధము చేయుటకు కావలసిన సాధనాలన్నీ ఆయనకు సమృద్ధిగా ఉన్నాయి.

తురుష్క సేనల ధాటికి తాళలేని, ఆంధ్రభూమిని గురించి మరిన్ని, వివరాలు శ్రేష్ఠి సేకరించారు. ఆంధ్రభూమిని యవన భట నిష్కంటకం చేయుటకు ప్రోలయ వేముడు స్థిర చిత్తముతో ప్రయత్ని స్తున్నాడు. ఆయన కడగొట్టు తమ్ముడు మల్లారెడ్డి వేమారెడ్డికి కుడి భుజంగానిలిచి, నల్లమల కొండలలోని శ్రీశైల ప్రాంత సమీప భూమిని తన కార్యరంగం చేసుకొని, విజృంభిస్తున్నాడు. గోదావరీ తీర భూములలో శాంతిని సమకూర్చి అక్కడ ప్రజలను రక్షించుటకు ప్రోలయ నాయకుడు కృషి జేస్తున్నాడు. ఆ కృషిలో ఆయనకు కాపయాదులు సహకరిస్తున్నారు. కర్ణాటక భూముల్లో పరిస్థితులు అస్తవ్యస్తంగా ఉన్నాయి. దక్షిణాన మధురలో కొందరు నాయకులు కృషిజేస్తున్నారు. ఒకప్రక్క యవనులు ఆంధ్ర ప్రజలను బాధపెడ్తూ ఉంటే, మరొకవంక చెంచులు గుంపులు ప్రజల ధనాలను దోచుకొంటున్నారు. ఎదురు తిరిగిన వారిని సంహరిస్తున్నారు.

ఇట్టి విషమ పరిస్థితిలో అప్పటి ఆంధ్రభూమి ఉంది. ముందు మధ్యాంధ్ర దేశం నుండీ యవనులను పారద్రోలితేనే కానీ అక్కడ శాంతి, సౌఖ్యాలు ఏర్పడవు.

మదగజముపై ఠీవిగా కూర్చొని అవచి హుందాగా ప్రయాణిస్తున్నాడు. ఆయన వెనుక ఐదు అందోళికలు సాగుచున్నవి. ఆ అందోళికలలో స్త్రీజనం ఉన్నారు. రెండువందలమంది అశ్వికులు సాయుధులై ఆయన్ను పరివేష్టించి నడుస్తున్నారు. వారంతా ఉక్కుకవచాలు ధరించారు. ఆ పరివేష్టనము ఉక్కుగోడవలె కన్పిస్తుంది. వారి వద్ద డాళ్ళుకూడ ఉన్నవి. అవి చాలా వెడల్పైన డాళ్ళు. వారంతా 'తాఫీ'గా నడుస్తున్నారు. వారి ఆ నడకలో వేగిరపాటు కన్పించుటలేదు. ఆతురత అసలే అగుపించదు. గుఱ్ఱాలు కట్టిన బండ్లు

కూడ కొన్ని ఉన్నవి. వాటిలో సరుకులు ఉన్నవో? లేవో తెలియుటలేదు. వ్యాపార నిమిత్తమైన సరుకులు లేకున్నా, దారి బత్తెమునకు కావలసిన సరుకులు ఉండుటకు అవకాశం ఉంది.

అవచి నడుస్తున్న ఆ దారి పూర్తిగా యవన భటసంకులమైనది. దారి దోపిడీలు చేయుటకు గాను చిన్న, చిన్న గుంపులుగా ఏర్పడిన చెంచులు కానీ, యవన భటులు కానీ ఒకటై ఎదుర్కొనుటకు సాహసించుటలేదు. యవనులూ, చెంచులేకాదు ఎవరు వచ్చి తమను అడ్డగించినా వారు సరుకు చేయరు. ఎవరైనా తమకు కీడు చేయాలని ప్రయత్నిస్తే కనికరం లేకుండా కఠినంగా దండిస్తారు. వారికి ఎదురైన వారు ప్రక్కకు తొలగి దారి ఇస్తున్నారు. ఆ బృందము వెళ్ళిన తర్వాత వెనుక నుండి వారి నడక తీరును చూచి ఆశ్చర్యపడుచున్నారు. ఈ దారిన వెళ్ళుటకు తగిన అధికారపత్రములు మీకున్నవా? అని అడుగుటకు అక్కడక్కడ ఉన్న యవన భటులకు ధైర్యము చాలుటలేదు. సమస్తాధికారాలు నిర్దాక్షిణ్యంగా కలవారివలెనే వారు పయనిస్తున్నారు. పాదుషా గారి 'ఫర్మానా' వీరికి ఉన్నదేమో అని - కొందరు భావిస్తున్నారు.

సూర్యుడు అస్తమించాడు. దిక్కులను గ్రమ్మిన సంజకెంజాయ క్రమంగా కరిగి పోవడం ఆరంభించింది. శ్రేష్ఠి ఆనాటికి తన ప్రయాణాన్ని ఆపివేశారు. విశాలమైన సమతల ప్రదేశాన్ని చూచి, భటులు రెండు పటకుటీరాలను నిర్మించారు. చీని చీనాంబరాలు, రత్న కంబళాలతో వాటిని అందంగా అలంకరించారు. వారంతా మృష్టాన్న భోజనాలను భుజించారు. ఒక పట కుటీరములో అవచి విశ్రమించాడు. రెండవ దానిలో స్త్రీ జనం శయనించింది. మిగిలిన పరివారమంతా తగిన శయ్యలను ఏర్పరుచుకొని పవ్వళించారు. భటులు కొందరు వంతులు వేసుకొని 'పహారా' తిరుగుచూ ఆ విడిదిని కాపలా కాస్తున్నారు. చుట్టూ నెగళ్ళు మండుచున్నాయి. మదించిన గజముల గంధపు వాసనలకు పులులు, చిరుతలు వైదొలగి దూరంగా వెళ్ళుచున్నాయి.

అవి కార్తీకమాసపు పూర్వపక్షపు రోజులు. చల్లని గాలులు వీస్తున్నాయి. తెల్లని వెన్నెల పిండి ఆరబోసినట్లుగా ఉంది.

మహారాజుల వలె అవచి, అన్ని భోగాలనూ అనుభవిస్తాడు. ఛత్రము, చామరము, పగటిదివిటీ ఆయనవెంట ఉంటాయి. పవళింపు సేవలూ, మేల్కొలుపులూ, అనుదిన ఆచారంగా జరగాల్సిందే.

'శ్రీ త్రిపురాంతకదేవ దివ్య శ్రీ పాదపద్మారాధక, పరమ సాధక బహుపరాకు! కమల భవోరు సంభవ విమల వంశధార, ధర్మ ద్రావిడ బిరుదాధార బహుపరాకు! సుజన

విదేయ, కర్పూర వసంతరాయ బహుపరాకు! కీర్తి వనితావల్లభ, నిరంతర ద్వీపాంతర వర్తి శతాధికానేక మహాపోత పాత్రాధివల్లభ బహుపరాకు! ప్రతిదిన సమారాధిత పరమేశ్వర, మాణిక్య సింహాసనాధీశ్వర బహుపరాకు! అంగీకృత భూసురాశీర్వాద, సంతతశ్రుతి భూషాయ మానసంగత వేదవాద బహుపరాకు! – దానధర్మ పరాయణ, ఇమ్మడి గరుడనారాయణ బహుపరాకు! నిజకీర్తి శాసన స్తంభాయ మాన దిగంత దంతావళ దంత బహుపరాకు! అభయ ద్రావిళ బహుపరాకు! – కిష్కింధాచల క్రీడా వినోద బహుపరాకు! – వినిర్మల కులశీల, పాండ్యరాయ కందుక క్రీడావిలోల బహుపరాకు! కవిజన స్తోత్రపాత్ర కౌండిన్యగోత్ర పవిత్ర, బహుపరాకు! – చతుష్షష్టి విద్యా జన్మభూమి, అయోధ్యానగరస్వామి రఘురామాభీరామ బహుపరాకు! వీరమహేశ్వరాచార, దురితదూర బహుపరాకు! – చిరుతొండ నంబిపయః పారావార రాకాసుధాకర బహుపరాకు! – పరమ వైష్ణవ కాంచీనగర కుటుంబి శ్రీ కంచినంబి వంశాంబుధిచంద్ర బహుపరాకు! – సింహ విక్రమ పట్టణ శ్రేష్ఠ సెట్టి జగజెట్టిహావాణి సెట్టి విభుని యవచి దేవయ సెట్టి బహుపరాకు! – మాచాంబాగర్భ శుక్తి ముక్తాఫల బహుపరాకు! –"

అని పరాకులు పలికారు. తమిళ, కర్ణాటక, భాషల్లో కూడ ఆ పరాకులు సాగాయి. ఆయనవెంట ఉన్న విద్యత్కవి కమలనాభా మాత్యుడు, గీర్వాణ భాషలో శ్లోకరూపముగా ఆశీర్వదించాడు. ప్రయాణ మధ్యము కాబట్టి ఇదంతా కొంత సంక్షిప్తముగా జరిగింది.

–కమలనాభామాత్యుడు కాల్పట్టణాధీశుడు – అవచి దేవయ శ్రేష్ఠి కుటుంబానికి అత్యంత ఆప్తుడు. ఈ కమలనాభా మాత్యుడు, కవిసార్వభౌముడైన శ్రీనాధమహాకవికి తండ్రియని పలువురు చారిత్రక పరిశోధకుల భావన.

వారంతా నిద్రాదేవి ఒడిలోకి జారుకొన్నారు. ప్రదేశమంతా ప్రశాంతంగా ఉంది. ఎండుటాకు కదిలినా స్పష్టంగా విన్పించేటంత నిశ్శబ్దనిశీధి. సమగ్రము – సర్వసమగ్రము అని ఒకరికొకరు తెలుపుకుంటూ జాగరూకులై రక్షకభటులు అటు ఇటూ ప్రహారా తిరుగుచున్నారు. ఇంతలో సవ్వడి ఆ సవ్వడి పిట్టలు దూసుక పోయిన నట్లుగా ఉంది. మరికొంతసేపటికి నాలుగువైపుల నుండి గల, గలమనే శబ్దము. రక్షకభటులు గమనించారు. ఒకరితో ఒకరు మల్లాడుకున్నారు. విడిదిని చిన్నదిగా చేశారు. తమ వద్దగల వెడల్పైన డాళ్ళతో డాళ్ళకోటను కట్టారు. ఇంతలో వర్షమువలె, బాణములు వచ్చి పడ్డాయి. పడిన ఆ బాణాలు ఆ డాలుకోటను ఏమీ చేయలేక పోయాయి. తిరిగి శర

ప్రయోగము. ఆశరములు సుశిక్షితులు ప్రయోగించినట్లుగా ఉన్నవి. రెండవ మారు వచ్చిన ఆ బాణాలు డాలు కోటను బలంగా తగిలాయి. డాలు కోటకు ఏమీకాలేదు. కానీ బలంగా తాకిన ఆ బాణాఘాతములకు డాలుకోట దద్దరిల్లింది. అవచి మేల్కొన్నాడు. డాలు కోటను మరింత చిన్నదిగా చేయమని ఆజ్ఞ ఇచ్చాడు. తిరిగి బాణప్రయోగము ఈ మారు వచ్చిన ఆశరాఘాతాలకు రెండుగుఱ్ఱాలు గాయపడ్డాయి. దళపతి ఆ బాణాలను పరిశీలించాడు. అవి యవనులవని అభిప్రాయపడి కమల నాభామాత్యునికి అందించాడు. వాటిని పరిశీలించిన అమాత్యుడు ఇవి యవనులవి కావు అని నిర్ధారించాడు.

"అవి చెంచులవి" అవచి దేవయ గంభీరంగా పలికాడు. శ్రేష్ఠి ఇంతటి నిశిత బుద్ధికలవాడు. శరనిర్మాణము, శర, సంధానము, వ్యూహరచన, ఆయనకు బాగా తెలుసు. సంగర కళాకోవిదుడు. ప్రహరణ కుశలుడు. శౌర్యవంతుడు. స్వయంగా కత్తిని బట్టి మహా కిరాతకులైన సముద్ర దస్యులన్ను ఎదుర్కొనేమొనగాడు. అవచి ఆజ్ఞ ఇచ్చాడు. ఒక వైపుకు పది మంది, మరోవైపుకు పదిమంది మహాయోధులైన భటులు పరుగులు తీశారు. ఆశ్వకుల కదలికను గమనించిన చెంచెలూ పరుగులు తీశారు. అశ్వముల పద తాకిడికి కొందరికి కాళ్ళు విరిగాయి. కొందరికి చేతులు విరిగాయి. మరికొందరు ఇతర విధాలా గాయపడ్డారు. ఇద్దరు చెంచులు ఆ భటులకు చిక్కారు. చిక్కిన ఆ ఇద్దరినీ, తెచ్చి, అవచి దేవయ తిప్పని ముందు నిలబెట్టారు. అవచి ఆజ్ఞతో ఆ బందీలు ఇర్వురినీ ఒక ఎత్తైన ప్రదేశముల నిలబెట్టారు.

చెంచులారా! మీరంతా వెంటనే దూరంగా వెళ్ళిపోండి. ఇక్కడ అవచి దేవయ ప్రభువు విడిది చేసి ఉన్నాడు. మీరు దూరంగా వెళ్ళకుంటే బందీలుగా చిక్కిన ఈ ఇర్వురినీ చిత్రవధ చేయిస్తారు మా ప్రభువు. ఇకపై మామీద ఒక బాణంపడితే ఈ బందీలలో ఒకరి చేతి వ్రేళ్ళొకటి వెంటనే తెగిపోతుంది. ఇది అవచిదేవయ ప్రభువు ఆజ్ఞ" అని ఒక భటుడు ఆ ఆజ్ఞను ఉచ్ఛైస్వరముతో ప్రకటించాడు. బాణములు ఆగిపోయాయి. ఆ ప్రాంతమంతా నిశ్శబ్దంగా ఉంది. ఆ నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తూ మరొకశరము అతి వేగముగా వచ్చి అవచి ఎదురురొమ్ముకు తగిలింది. అట్లు తగిలిన ఆబాణము ఖంగుమని శబ్దము చేసి నేలపై బడింది. ఆయన భయపడలేదు. చిఱునగవు ఆయన ముఖంపై దోబూచులాడింది. దేశ విదేశీయు లగు ఓడదొంగల నిశిత శరాఘతాల వాడినీ కరవాలాల పదునునూ అనేక మార్లు చవిచూచిన ఆ శ్రేష్ఠికి ఈ పాటి బాణముల దెబ్బలు లెక్కలోనివి కావు. శ్రేష్ఠి ఆదేశించాడు. బందీలలో

చిక్కిన వారిలో ఒక్కని వ్రేలు తెగిపడింది. భటులు సమీపమందలి పెద్దరాతిపై ఆతని వ్రేలును ఉంచి చురకత్తితో తెగవేశారు.

ప్రభువులు ఈ ప్రాంతములో మరికొంతకాలము ఉంటారు. మా వారికి ఏ కీడు జరిగినా అది మీవల్లే జరిగినట్లుగా భావిస్తారు. చిక్కిన ఈ బందీలు ఇద్దరినీ చిత్రవధ చేయిస్తారు. మీ గూడెము లన్నింటినీ నిప్పు పెట్టి కాల్పించి నేలమట్టం చేయిస్తారు. మీరు ఇప్పటికైనా బుద్ధితెచ్చుకొని, సక్రమంగా ప్రవర్తిస్తే ఈ బందీలు ఇద్దరినీ మన్నించి విడిచి పెడ్తారు. ప్రభువులు మీకు మంచి మంచి బహుమతులు ఇస్తారు. అని మరోసారి భటుడు అవచిదేవయ ఆజ్ఞను గొప్ప స్వరముతో ప్రకటించాడు. త్రెంచిన ఆ వ్రేలిని అచ్చట గల ఎత్తైన చెట్టుకొమ్మకు గుర్తుగా కట్టించాడు శ్రేష్ఠి. వ్రేలు తెగిన ఆతనికి తగిన వైద్యం చేయించాడు.

ఆ చిక్కిన ఇర్వురిలో ఒకడు ఆ చెంచెల గుంపుకు ప్రధానుడు. ఆతడు పెద్ద కేక వేశాడు. పెద్దపులి గాండ్రింపు వలె ఉంది ఆ కేక. ఆ కేకను విని ఆగుంపులు ఆశ్చర్య పోయాయి. మరింత జాగ్రత్త పడ్డాయి. ఆ కేకతో బాటు,ఆతడు 'సుగ్రీవా' అని అన్నాడు. ఆతడు అవచి దేవ పాద పద్మాలకు సాగిలపడి మ్రొక్కాడు. చిక్కిన ఆ ప్రధానుని పేరు 'సుగ్రీవుడు' అని అవచికి అవగతమైంది. అవచి దేవయ ఆజ్ఞను తన ఆజ్ఞగా పాటించండి అని ఆ కేకకు అర్థమని శ్రేష్ఠి గ్రహించాడు.

ఆ కేకకు ప్రతిగా చిత్తము, చిత్తము అను పలుకులు వినిపించాయి. గల, గల శబ్దము ఆగిపోయింది. అడుగుల సవ్వడిని బట్టి వారంతా దూరంగా వెళ్ళి పోయారని భటులు నిర్ణయించారు. సుగ్రీవుని దృఢంగా బంధించమనీ, ఆతన్ని ఆదరముతో చూడమనీ అవచి ఆజ్ఞ ఇచ్చాడు. భటులకు అందరినీ విశ్రాంతి తీసుక పొమ్మని అవచి ఆజ్ఞ ఇచ్చాడు.

రాత్రి మూడు ఝాములు గడిచాయి. నాల్గవ ఝాము ప్రారంభమైంది. మల్లారెడ్డిని పిలవమని అవచి చెప్పాడు భటులకు .

మల్లారెడ్డి – మల్లారెడ్డి – మల్లారెడ్డి అని ఒకకేక మూడుసార్లు మంద్ర స్వరముతో

జవాబు లేదు.

మల్లారెడ్డి అని మూడుసార్లు మధ్యమ స్వరంతో మరో కేక.

సమాధానంలేదు.

మల్లారెడ్డి అని మూడుసార్లు మూడవసారి అతి తారాస్థాయిలో పిలుపు.

ఈ మారు జవాబు వచ్చింది.

మల్లారెడ్డిని పిలుస్తున్న వారెవరు?

మల్లారెడ్డి స్నేహాన్ని కోరే అవచి దేవయ తిప్పయ్య శ్రేష్ఠి.

మంచిది. మల్లారెడ్డికి విన్నవిస్తారు. రేపు మీకు సమాధానం వస్తుంది.

(ఇంకావుంది)

## శ్రీ పత్తి వెంకట స్వామి శ్రేష్ఠి గారి స్వర్గారోహణ

చిత్తూరు పట్టణ వైశ్య ప్రముఖులు, కార్యశూరులు శ్రీ పత్తి వెంకట స్వామి శ్రేష్ఠిగారు 22-7-1996వ తేదీన స్వర్గస్తులయ్యారు.

ప్రకటన

# భాగ్యనగర్ వాసవి సామూహిక వివాహ సంస్థ (రిజిష్టర్డ్)

ఆఫీసు : కుబేర టవర్సు, (5వ అంతస్తు),
నారాయణగూడ, (తాజ్‌మహల్ హోటల్ ఎదురుగా),
హైద్రాబాద్-29.

## 8వ వధూవర పరిచయసభ – 27.10.1996 ఆదివారం నాడు

పై సంస్థ ఆధ్వర్యంలో 27.10.1996 ఆదివారం ఉదయం గం. 9.30 లకు సికింద్రాబాద్, పెండర్ ఘాస్ట్ రోడ్డులోగల ఆర్యవైశ్య అభ్యుదయ సంఘంవారి శ్రీ జూటూరి వీరేశలింగం కళ్యాణ మండపములో ఎనిమిదవ వధూవర పరిచయ సభ జరుగును. రాష్ట్రములోను, ఇతరత్రా గల అర్హులైన ఆర్యవైశ్య వధూవరు లెల్లరు పాల్గొనవచ్చును. ఆ సమయములో మేము ప్రచురించు వధూవరుల పట్టికలో వారి వివరాలు ముద్రించుటకై 1.10.96 లోగా ఫోటోతోసహా మా కార్యాలయంలో రు. 20/-లు చెల్లించి, రసీదు పొంది, నమోదు చేసుకోగలరు. వేలాది వధూవరులు మా కార్యక్రమాల్లో పాల్గొని వారి జీవిత భాగస్వాములను ఎన్నుకోగలరు. వధూవరుల పట్టిక విలువ రు. 20/-లు. ఆ పట్టికలో వ్యాపార ప్రకటనలకై రు. 150/-లు నగదు/డి.డి. చెల్లించు వారికి ఒక పట్టికను వారికి పంపబడును.

మీ సేవాభిలాషులు

| కల్వ జయకుమార్, | కుంభం నరసింహారావు, | జి.సి. గుప్త, |
|---|---|---|
| అధ్యక్షుడు. | కోశాధికారి. | ప్రధాన కార్యదర్శి. |
| ఫోన్ : 516425 | ఫోన్ : 312198. | ఫోన్ : 875284. |

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని ఆర్యవైశ్యులచే నిర్వహింపబడు నిత్యాన్నదాన సత్రాలు

1) శ్రీశైలం : శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్న సత్రము, వాసవీ సత్రం, కర్నూలు జిల్లా.
పిన్ కోడ్ నెం. 518 101.

2) శ్రీశైలం : అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్యాన్న పూర్ణసత్రము, (కంభం సత్రము), కర్నూలు జిల్లా.
పిన్ కోడ్ నెం. 518 101.
కేంద్ర కార్యాలయం కంభం, ప్రకాశం జిల్లా.

3) పుట్టపర్తి : శ్రీవాసవీనివాస్, అనంతపురం జిల్లా.
పిన్ కోడ్ నెం. 515 134.

4) తిరుపతి : శ్రీ వాసవీ నిలయం, శ్రీ ఉప్పుటూరు యతిరాజుల శ్రేష్ఠి ట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

5) తిరుమల : శ్రీ వాసవీ భవన్, తిరుమల - 517 504.

6) ఎగువ అహోబిలం : శ్రీమత్ పెద్ద అహోబిల ఆర్యవైశ్య అన్నసత్రం, కర్నూలు జిల్లా.
సంప్రదించాల్సిన విలాసం :
శ్రీ మేడా నరసింహులు శ్రేష్ఠి, 6-3-609/161, ఆనంద్ నగర్, ఖైరతాబాద్, హైదరాబాద్.
పిన్ కోడ్ నెం. 500 004.

7) విజయవాడ : శ్రీకన్యకా పరమేశ్వరీ అన్న సత్రం, శివాలయం వీధి, కృష్ణా జిల్లా.

8) అన్నవరం : శ్రీ ఆర్యవైశ్య నిత్యాన్న సత్రము. తూర్పు గోదావరి జిల్లా.
పిన్ కోడ్ నెం. 533 406.

9) వేములవాడ : శ్రీ రాజరాజేశ్వర క్షేత్ర ఆర్యవైశ్య వాసవీ నిత్యాసత్రం, కరీంనగర్ జిల్లా. పిన్. 505 302.

10) మంత్రాలయము : ఆర్యవైశ్య సేవాసంఘ అన్న సత్రం, కర్నూలు జిల్లా.
కేంద్రకార్యాలయం, పటేల్ రోడ్డు, రాయచూర్ - 584 101.

11) మహానంది : మహానంది క్షేత్ర ఆర్యవైశ్య నిత్యాన్న సత్రం, కర్నూలు జిల్లా., కేంద్రకార్యాలయం, 4-3-94, నంద్యాల. కర్నూలు జిల్లా. పిన్. 518 501.

12) బ్రహ్మంగారి మఠం : శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్న దాన సత్రం, కడప జిల్లా. పిన్. 516 603.

13) యాదగిరిగుట్ట : శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ఆర్యవైశ్య నిత్యాన్న సత్రం, నల్గొండ జిల్లా.

14) భద్రాచలం భద్రాచల క్షేత్ర శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ఆర్యవైశ్య నిత్యాన్నదాన సత్రం, ఖమ్మం జిల్లా.
కేంద్ర కార్యాలయం, మార్కెట్ రోడ్డు,
ఖమ్మం – 507 111.

15) భాసర : ఆర్య ఇందూరు ఆర్యవైశ్య జ్ఞాన సరస్వతీ అన్న సత్రము, నిజామాబాదు జిల్లా.

16) ముథోల్ : ఆర్యవైశ్య నిత్యాన్నసత్రం, ఆదిలాబాద్ జిల్లా.

17) మట్టపల్లి : శ్రీ లక్ష్మీనృసింహ క్షేత్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సత్రం, నల్గొండ జిల్లా.

18) నాచారం : ఆర్యవైశ్య నిత్యాన్న సత్రం, తూప్రాన్ మండలం, మెదక్ జిల్లా.

19) కొమరవెల్లి శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ఆర్యవైశ్య నిత్యాన్న సత్రము, చేర్యాల మండలం, వరంగల్ జిల్లా.

20) కొడవటూరు వైశ్య నిత్యాన్న సత్రము, బచ్చన్నపేట మండలం, వరంగ జిల్లా.

21) ధర్మపురి : ధర్మపురీ క్షేత్ర ఆర్యవైశ్య వాసవీ నిత్యాన్న సత్రం, కరీంనగర్ జిల్లా. పిన్. 505 425.

22) కాళేశ్వరము : శ్రీ వాసవీ ఆర్యవైశ్య నిత్యాన్న సత్రము,
మహాదేవ పూర్ మండలము, కరీంనగర్ జిల్లా.
పిన్. 505 504.

గమనిక : శ్రీ వాసవీసత్రం, శ్రీశైలం, పుట్టపర్తి తిరుపతి – తిరుమలలోని అన్నసత్రాల కేంద్ర కార్యాలయము, ప్రకాశం జిల్లా మార్కాపురంలో ఉంది.

ఇతర రాష్ట్రాలు

ఘటికాచలం : (–షోలింగర్) అఖిల భారత ఘటికాచల క్షేత్ర ఆర్యవైశ్య నిత్యాన్న దాన సత్రం, కొండపాళెం, షోలింగరం,
తమిళనాడు. పిన్. 631 102.

కాశి : (1) గుంటూరు సత్రం, కేంద్రకార్యాలయం గుంటూరులో ఉంది.
(2) శ్రీ కాశీ ఆర్యవైశ్య వాసవీ నిత్యాన్న సత్రం,
కేంద్రకార్యాలయం, శ్రీ వాసవీ సేవా కేంద్రం,
ఖైరతాబాద్, హైదరాబాద్.

# దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, తిరుమల

: 4942074, 4941973

## ▣ విజ్ఞప్తి ▣

అయ్యా,

మా ట్రస్టు బోర్డువారు నూతనముగా విరాళములు వసూలుచేయుటకు క్రింద ఉదహరించిన ప్రకారము తీర్మానించారు.

## "వైకుంఠ నివాసం" స్కీము - 1995 రు.10,116/- లు.

500 సభ్యులు మాత్రమే. పై సత్రమునందు వీరి జీవిత పర్యంతం సంవత్సరమునకు 3 రోజులు వారికిగాని, వారి అనుమతి పొందిన ఆర్యవైశ్యులకు మాత్రమే రూము ఉచితముగా యివ్వ బడును. ఉచితమనగా కనీస మెయిన్‌టెనెన్స్ చార్జి ట్రస్టుబోర్డువారు అట్టి సమయములలో నిర్ణయించిన ప్రకారము వసూలు చేయబడును. సంవత్సరమనగా ఏప్రిల్ 1-వ తేది నుండి మార్చి 31-వ తేది వరకు, తిరుమల చేరుటకు 10 రోజులు ముందుగా రిసెప్షనిస్టు, దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, రింగ్ రోడ్డు, తిరుమల అనే అడ్రసుకు తెలియపరచవలెను. ఒక తేదీన ఒకరికి మాత్రమే వ్రాసి పంపవలెను. మరొకరికి వ్రాసి పంపకూడదు. ఏ కారణముచేతనైనా ప్రయాణము నిలిపినచో టెలిగ్రామ్ ద్వారా క్యాన్సిల్ అని కనీసం ఒక రోజు ముందు రిసెప్షనిస్టుకు తెలియపరచవలెను. అలా తెలియపరచనిచో ఒకరోజు మీ కోటాలో తగ్గించ బడును. మైనరు దాతలు అంగీకరింపబడరు. ఎవరు ముందు పంపెదరో వారిని నిర్ణీత పరిమితి లోపలే తీసుకోబడును. తర్వాత పంపినవారికి నిర్ణీత పరిమితి దాటితే వారి డి.డి.లు వారికి వాపసు పంపబడును. పూర్తి మొత్తం ఒకేసారి పంపవలెను.

డి.డి.లు పై సంస్థ పేరుతో మద్రాసు ఆఫీసు అడ్రసుకు "అక్కౌంటు పేయి"లో పంపవలెను. అప్లికేషన్ పూర్తిచేసిన దాత సంతకము తోనే పంపవలెను. వారికి బదులు యితరులు చేసిన చెల్లదు. విశేష పర్వదినములలో రిజర్వేషను ముందుగా చేయబడదు. రిసెప్షనిస్టు అప్పటి పరిస్థితులను బట్టి ఖాళీగా వున్నచో యిచ్చెదరు.

ఇట్లు

**ఆర్.ఆర్.నాథం**
మేనేజింగ్ ట్రస్టీ

దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా
పరమేశ్వరీ ధర్మ పరిపాలనా సంస్థ.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1996 ఆగస్టు 21 నుండీ 1996 సెప్టెంబరు 20 వరకు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 25 | సెప్టెంబరు 1 | 8 | 15 |
| సోమవారము | | 26 | 2 | 9 | 16 |
| మంగళవారము | | 27 | 3 | 10 | 17 |
| బుధవారము | 21 | 28 | 4 | 11 | 18 |
| గురువారము | 22 | 29 | 5 | 12 | 19 |
| శుక్రవారము | 23 | 30 | 6 | 13 | 20 |
| శనివారము | 24 | 31 | 7 | 14 | |

ఆగస్టు 28 :- శ్రావణ పౌర్ణమి - రక్షాబంధన దినం.

ఆగస్టు 30 :- పుబ్బ కార్తె రాక.

అగస్టు 31 :- ఈ క్రింది తరగతుల వారు 1996-97 అసెస్మెంట్ సంవత్సరాలకు సంబంధించిన తమ సంవత్సరాదాయమును సంపద పన్నుల లెక్కలను అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను శాఖాధికారులకు పంపుటకు ఆఖరు తేది. (అ). కార్పోరేట్ అసెసీలు, కో-ఆపరేటివ్ సొసైటీలు. (ఆ). ఆదాయపు పన్ను చట్టము క్రింద ఆడిట్ చేయుంచుకోవలసిన అవసరములేని అసెసీలు. (ఇ). వర్తకము ద్వారా వృత్తిపరంగా వచ్చు ఆదాయముగల అసెసీలు. గమనిక : ఆదాయపు పన్నును ఫారము నెం. 2లోను, సంపద పన్నును ఫారము BA లోనూ దాఖలు చేయాలి.

అగస్టు 31 :- 1996 జూలై జీతములపై పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారమును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు తుది రోజు.

సెప్టెంబరు 4 :- శ్రీ కృష్ణ జన్మాష్టమి (స్మార్తులకు)

సెప్టెంబరు 5 :- శ్రీ కృష్ణ జయంతి - గోకులాష్టమి (వైష్ణవులకు)

సెప్టెంబరు 13 :- ఉత్తర కార్తె రాక రాత్రి 7-04.

సెప్టెంబరు 15 :- చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు అసెసీలు చెక్కుతో బాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను అధికారులకు చేర్చుటకు ఆఖరు తేది.

సెప్టెంబరు 15 :- రూ.1500/-లకు మించి ఆదాయపు పన్నును చెల్లించు అసెసీలు తమ అంచనా ఆదాయము (అడ్వాన్సు ట్యాక్సు)లో 20శాతమును చేర్చుటకు చివరి తేది.

సెప్టెంబరు 16 :- వినాయకచవితి. సెప్టెంబరు 17 :- ఋషి పంచమి.

సెప్టెంబరు 20 :- A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది.

**25, 1, 8, 15 ఆదివారాలు**

*నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.*

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )


టెలిగ్రాం అన్ని చోట్లా "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"

టెలిఫోన్ నెం. : మార్కాపురం : 22740, 22004

శ్రీశైలం : 87140, 87114

పుట్టపర్తి : 87240, 87440, తిరుమల : 77682


## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :- 150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00లు శాశ్వత సభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించ బడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

   30×10 రూము రూ.30,000/-, 15×9 రూముకు రూ.25,000/- అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,00,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించ బడును. సం॥లో ఒక నెల రూము కేటాయించబడును. 2. రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. 3. రు.1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల :</u> తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50x100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు). సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

**హాల్సు డోనార్సు :** 50x12 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్ల మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు యివ్వబడును 14 అంకణములు పరిమితం.

రు.2116-00 సమర్పించిన వారికి వంశపారపర్యంతం సభ్యత్వం ఉండును.

అన్నదానమునకు రు.100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన పర్వ దినం రోజునను, రు.6116-00 సమర్పించిన పర్వ దినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును.

4. <u>వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులుచెట్టి ట్రస్టు, కొత్త వీధి, తిరుపతి.</u>

తిరుపతిలో మా సంఘం ద్వారా పై పేరుతో సత్రం కట్టుకొనుటకుగాను మద్రాసు ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు వారు తిరుపతి కొత్తవీధిలో షుమారు 7 వేల చ॥ అ॥ గల పాత భవనమును ఉచితంగా సమర్పించినారు. ఈ పాత భవనం పునః నిర్మాణమునకు 4.10.95 ఉదయం గం॥ 9-21 ని॥లకు శంఖుస్థాపన, అదే రోజు ఉదయం గం॥ 9-47 ని॥లకు నిత్యాన్న సత్రంనకు అగ్నిప్రతిష్ఠాపన జరిగినది. భోజనహాలు నిర్మాణం చేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10.95 నుండి నిత్య భోజనములు, వసతులు ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన కోర్తాము.

## తిరుపతి వసతి సత్రమునకు విరాళములు

రూ.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. ఫోటో వేసి, నాపరాయి పైన వారి పేరు చెక్కించబడును.

రూ.10000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫోటో వేసి నాపరాయి పైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.5000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.2116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి ఫోటో మరియు బోర్డు వేయబడును.

రూ.1116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల వంశపారంపర్యంతం సభ్యత్వము, పర్వదినం రోజున అన్న సంతర్పణ ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుప బడును. పై యిద్దరికి వంశపారంపర్యంతం సభ్యత్వం కలదు. రు. 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో, ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల

సౌకర్య ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారంపర్య సభ్యులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును. -

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCET లో పాసై ఇంజనీరింగ్, మేడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ క్రతువు 16.11.95 నుండి 24.11.95 వరకు పుట్టపర్తిలో జరిపించినాము. 1996వ సంవత్సరములో క్రతువు ఎక్కడ జరుపునదీ జరుగబోవు కార్యవర్గ సమావేశములో నిర్ణయిస్తాము.

—: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :—

మూర్తి వెంకటేశ్వర్లు,

వాసవీ సత్ర సముదాయం, కార్యదర్శి కార్యాలయం,

మార్కాపురం – 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

**N.B :-** పై సత్రముల పేరుతో – D.D. లు కాని, చెక్కులుకాని ఆయా సత్రములకు పంపకోర్తాము లేదా మార్కాపురం అడ్రసుకైనా పంపవలెను. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# పోతన భాగవతం

(గత సంచిక తరువాయి)

## సరస్వతీ ప్రార్థన

ఉ. శారద నీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా
హారతుషార ఫేన రజతాచల కాశ ఫణీశ కుంద మం
దార సుధా పయోధి సితతామరసామర వాహినీ శుభా
కారత నొప్పు నిన్ను మది గానగ నెన్నడు గల్గు భారతీ!

– ఈ పద్యం పోతన గారి సరస్వతీ ప్రార్థనా పద్యాలలో ముఖ్యమైనది. ఇంకా (1) తల్లీ నిన్ను దలంచి (2) క్షోణితలంబు నెన్నుదురు సోకగ (3) పుట్టంబుట్ట కూడా వున్నాయి. 'అంబనవాంబుజోజ్వల' – అన్నది పోతన గారిది కాదనే వాదం వుంది.

పై పద్యంలో సరస్వతీ దేవి అన్ని విధాలా తెల్లగా వున్నట్లు వర్ణించారు. అటువంటి శుభాకారంతో నొప్పు భారతిని ఎప్పుడు చూస్తానా అని పోతనగారు తపిస్తున్నారు.

ఒక దేవతను సాక్షాత్కరింపజేసుకోవాలీ అంటే అందుకు ఉపాసన చేయాలి. ఉపాసనకు మంత్రం కావాలి. సరస్వతిని చూడాలి అంటే సరస్వతీ మంత్రోపాసన చేయాలి.

సరస్వతీ మహా మంత్రాలలో ముఖ్యమైనవి పదకొండు వున్నాయి. అవి 1. సరస్వతీ దశశ్లోక మహామంత్రం, 2. ప్రణోదేవి, 3. అనోదివః, 4. పావకానః, 5. చోద యిత్రీ, 6. మహోఅర్ణ, 7. చత్వారివాక్, 8. యద్వాక్, 9. దేవీం వాచం, 10. ఉతత్వః, 11. అంబితమ. ఈ మంత్రాలకు ఋషులు, ఛందస్సులు, దేవత, కీలకం మొదలైనవే కాక విడిగా ధ్యాన శ్లోకాలలోని పదబంధాలను తీసుకొని పోతనగారు తన పద్యాలలో పొదగటం ద్వారా సరస్వతీ ఉపాసనను సూచించారు.

ఉదాహరణకు, 'మానసేరమతాం సర్వ శుక్లా సరస్వతీ' అని ధ్యాన శ్లోకం, పై పద్యంలో శారద సర్వశుక్లరూపిగా వర్ణించబడింది.

అలాగే 'అక్షమాలా శుకధరా పద్మపుస్తక ధారిణీ' అన్న ధ్యాన శ్లోక ప్రయోగాన్ని 'అక్షదామ శుక వారిజ పుస్తక రమ్య పాణి' అని తన 'క్షోణి తలంబు నెన్నుదురు సోకగ'..... అన్న పద్యంలో ఉపయోగించారు. సరస్వతీ ప్రార్థనలో సరస్వతీ దేవతా మహామంత్ర ధ్యాన శ్లోకాలననుసరించటం మంత్ర శాస్త్ర విదులైన కవులకే సాధ్యం.

## అలవైకుంఠపురంబులో ......

పోతన గారి భాగవతంలో కొన్ని ఘట్టాలు స్వతంత్రమైన కథల్లా ప్రజారంజకంగా మలచబడ్డాయి. ప్రహ్లాద చరిత్ర, వామనావతారం, క్షీరసాగర మథనం, గజేంద్ర మోక్షం, రుక్మిణీ కళ్యాణం మొదలైనవన్నీ అటువంటివే.

సంస్కృత భాగవతంలో గజేంద్ర మోక్షంలో గజేంద్రుని ప్రార్థన నాలకించిన విష్ణువు చక్రాన్ని ధరించిగరుడునిపై నెక్కి వచ్చి మొసలిని సంహరించి, గజేంద్రుని రక్షిస్తాడు. ఈ సంగతిని రెండు శ్లోకాలలో చెప్పారు. కాని పోతన భాగవతంలో ఇది

14 పద్యాలయింది. అందులోనే 'సిరికింజెప్పడు' వంటి లోక ప్రసిద్ధి గాంచిన పద్యాలున్నాయి. ఆ భాగంలో వచ్చే 'అలవైకుంఠపురంబులో' అనే పద్యం గురించి ఒక కథ ప్రచారంలో వుంది. పోతనగారు 'అలవైకుంఠ పురంబులో నగరిలో నా మూలసౌధంబు దాపల...' అని రాసి ఆ పైన ఏంరాయాలో తోచక బయటికిపోయారు వెళ్ళారట. ఆ సమయంలో శ్రీరామచంద్రుడు పోతనగారి వేషంలో వచ్చి ఆ పద్యాన్నిలా పూర్తిచేసి వెళ్ళాడట!

"అల వైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు దాపల మందార వనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలోత్పల పర్యంక రమా వినోదియగు నాపన్న ప్రసన్నుండు విహ్వల నాగేంద్రము 'పాహి' 'పాహి' యన గుయ్యాలించి సంరంభియై".

'వైకుంఠపురం', పురంలో 'రాచ నగరు', అందులో 'ఆ మూల సౌధం', దానికి దగ్గరగా విష్ణువు ఎక్కడ ఉన్నాడట? మందార పూల చెట్ల వనంలో, అమృత సరోవరం చెంత, చంద్రకాంత శిలామణుల వేదికపై కలువపూవుల పాన్పుపై లక్ష్మీదేవితో కలిసి వినోదిస్తున్నాడు. 'రక్షించు, రక్షించు' అని గజరాజు మొరబెట్టుకోగా ఆయన విని 'సంరంభియై' (బయలుదేరాడు). విష్ణువు భక్తులను రక్షించటానికి పడే తొందరను పోతనగారు ఈ ఘట్టంలో కన్నులకు కట్టినట్లు చక్కగా చూపించారు. ఇష్టసతి లక్ష్మీదేవితో వినోదించే విష్ణువు అదంతా వదిలేసి హడావుడిగా బయలుదేరటానికి ఆయన 'ఆపన్న ప్రసన్నుడు' - ఆపదలోనున్న వారిపట్ల ప్రసన్నత కలవాడు కావటం కారణం. ఇంతకూ విష్ణువు ఆ సమయంలో అక్కడున్నట్లు ఎలా తెలిసింది? దానికి ఆగమాలలో కనిపించే ఆధారాలను పోతనగారు వాడుకున్నారు.

'కల్పద్రుమూలే మణివేది మధ్యే
పర్యంక పీఠం మృదులోత్పలాఢ్యం
సుధారసః ప్రాంతగతం రఘుప్రభో!
గృహాణ సీతా వనితా సమన్వితః'

అంతేకాదు, మరో ఆధారం. 'శ్వేతద్వీపాయ నమః, శ్వేత ద్వీపమధ్యే దివ్యవేదికాయై నమః, వేదికా మధ్యే కల్ప వృక్షాయ నమః, కల్పవృక్ష స్యాధస్తాద్రత్న సింహాసనాయై నమః, తన్మధ్యే శ్రీరామ చంద్రాత్మనే నమః' శ్వేత ద్వీపం, దానిమధ్య దివ్య దేవిక, వేదిక మధ్య కల్పవృక్షం, కల్పవృక్షం క్రింద రత్నసింహాసనం మధ్యలో శ్రీ(లక్ష్మీలేక సీత), తో కూడి వున్న రామచంద్రునికి నమస్కారం. మూలంలో లేని వైకుంఠపుర వర్ణనను పోతనగారు చేర్చారు. దానిని ఆగమాధారంగా మలచారు. అలాగే మూలంలో విష్ణువు చక్రాన్ని ధరించి గరుడునిపై గజేంద్రరక్షణకు వెళతాడు. కాని పోతనగారి భాగవతంలో ఎట్లా వున్నవాడు అట్లాగే అతి సంరంభంతో పయనమై వెళ్ళగా ఆయన వెంట అమ్మవారు (లక్ష్మీదేవి) ఆమె వెంట ఒక్కొక్కరుగా మొత్తం వైకుంఠపురంలోని ఆబాలగోపాలం కదిలివెళతారు. సందర్భోచితమే కాక సహజత్వం సంతరించుకొన్న ఈ ఘట్టం పండితపామర రంజకంగా రచించిన పోతనగారి పాండిత్యంలోని ఆగమసారానికి అద్దం పడుతోంది.

**(కీ. శే. తుమ్మలపల్లి రామలింగేశ్వర రావు (అద్వయానంద భారతీ స్వామి) గారిరచనల ఆధారంగా...)**

(యన్.ఐ.యస్. వారి సౌజన్యంతో)

# శ్రీ వాసవీ ఆర్యవైశ్య బాలికల వసతి గృహము

**22/326, రెడ్డివారి వీధి, గాంధీ బజారు, పాతవూరు,**
**అనంతపురము - 515 005. ఫోన్ : 31255 P.P.**

ఆంధ్రప్రదేశ్‌లో వెనుకబడిన ప్రాంతమైన రాయలసీమలో గల అనంతపురం పట్టణము నందు విద్యాసంబంధమైన యూనివర్శిటీ, డిగ్రీ కళాశాలలు, జూనియర్ కళాశాలలు, ఇంజనీరింగ్, పాలిటెక్నిక్, లా కాలేజీ ఇంకను మరెన్నో ప్రైవేట్ కోర్సులు ఉంటూ మరియు త్వరలో మెడికల్ కాలేజీ ఏర్పాటు కానున్న తరుణములో పై సంస్థ వారిచే ఆర్యవైశ్య బాలికలకు ఉచిత భోజన వసతి గృహము 16-6-95వ, తేదీన దక్షిణామ్నాయ ఆర్యవైశ్య పీఠాధిపతులగు పూజ్యశ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖర స్వాముల వారి సువర్ణ హస్తములతో ప్రారంభించబడి 20 మంది బాలికలకు వసతి ఏర్పాటు చేయడమైనది. నేటి సమాజములో స్త్రీ మూర్తులు విద్యావంతులైతే వారి సంతానం విద్యావంతులై సామాజిక పరివర్తన కలిగి సంఘశ్రేయస్సుతో, దేశశ్రేయస్సుకు తోడ్పడగలరు. ప్రతి యింట్లో విద్యావంతులైన బాలికలు తయారు కావాలనే సదుద్దేశ్యముతో మేము ఈ వసతి గృహము ఏర్పాటు చేసినాము. ఈ సంవత్సరము దీని రూపురేఖలు మార్చి కనీసము 50 మంది బాలికలకు వసతి కల్పించాలనే సంకల్పముతో విస్తరింప చేయదలచినాము. కాన ఆర్యవైశ్యులెల్లరు ఆర్థిక వనరులొసంగి అంచలంచలుగా అభివృద్ధి చేయుటకు ఈ క్రింది విధంగా సహాయ సహకారములందించిన విద్యాదానం, అన్నదానం రెండింటికి సహాయము చేసిన వారై శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి కృపకు పాత్రులు కాగలరు.

రు. 16116-00లు. శాశ్వత పోషకులు (దాతల ఫోటో వేయుట, శిలాఫలకముపై పేరు చెక్కించుట, జీవిత పర్యంతం వారి ద్వారా ఒక బీద విద్యార్థినికి ఉచిత భోజన వసతి కల్పించబడును)

రు. 10116-00లు. మహారాజ పోషకులు : (దాతల ఫోటో వేయుట, శిలాఫలకముపై పేరు చెక్కించుట)

రు. 5116-00 లు. రాజపోషకులు. (శిలాఫలకముపై పేరు చెక్కించుట)

రు. 2516-00 లు. పోషకులు (శిలాఫలకముపై పేరు చెక్కించుట)

రు. 1116-00 లు. జీవిత సభ్యత్వం.

పై వారందరికి జీవిత సభ్యత్వం, ఓటు హక్కు కలదు)

డబ్బు పంపదలచిన దాతలు పై సంస్థ పేర గాని చెక్కు గాని పంపిన వెంటనే రసీదు పంపగలము.

శ్రీ గోపా నరసింహులు గారు, అధ్యక్షులు.
శ్రీ లక్కిశెట్టి రామకృష్ణయ్య గారు, ప్రధాన కార్యదర్శి.

(గత సంచిక తరువాయి)

జిల్లా మాజి[స్ట్రేటు సమ్మతించాలంటే ముందు పోలీసు సూపర్నెంటు ఒప్పు కోవాలి. అనగా స్పెషల్ [బాంచి పోలీసులు విడుదల చేయుటకు అంగీకరించి [వ్రాయాలి. అప్పుడు [ప్రధానిగారి కటాక్షం వుంటే విడుదల అవుతుంది. లేకపోతే లేదని దిగులు పడ్డారు.

ఇవన్నీ చూస్తూవున్న నేను విడుదల కొరకు [ప్రయత్నించడంలో ఎంతమా[త్రం [ప్రయోజనం వుండదని నిశ్చయించు కొన్నాను. నా భార్య అక్టోబరుమాసంలో నన్ను జైలులో కలుసు కొన్నప్పుడు విడుదలకోసం [ప్రయత్నించడం వృధా [ప్రయాసమని సలహా యిచ్చాను.

ఆ తరువాత వారంరోజుల్లో నా అక్కగారు మరణావస్థలో వున్నదని కావలినుండి కార్డు వచ్చింది. ఆ కార్డును [ప్రభుత్వానికి పంపుతూ, పెరోలు యివ్వండని కోరాను. కాని, ఆమె చని పోయిన యిరవై ఆరు రోజుల తరువాత పదిహేనురోజులు పెరోలు యిచ్చారు; అయితే మ[దాసు మీదుగా [ప్రయాణం చెయ్యకూడదని వుత్తరువు జారీ చేశారు. నా విషయంలో పోలీసులు [ప్రభుత్వాన్ని ఎంత భయపెట్టుతున్నారు! అని ఆశ్చర్య పడినాను.

పెరోలులో వుండగా రెండు ఆర్జీలు పెట్టాను. రాజకీయరంగం నుండి విరమించు కొన్న నన్ను యింకా జైలులో డిటెయిను చెయ్యడంలో ఎంతమా[త్రమూ న్యాయం లేదనిన్నీ, బేషరతుగా నన్ను విడుదల చెయ్యవలసిందనీ [ప్రధాని రెడ్డిగారికి [వ్రాసితిని. ఈ సందర్భంలో జైళ్ళ యిలాకా మం[తిగారితో మాట్లాడుటకు మ[దాసుకు రానివ్వ వలసిందని మరొక ఆర్జీ పెట్టగా అంగీకరించారు.

## నేను చేసిన నేరాలు

మ[దాసుకు రాగానే స్పెషల్ [బాంచి పోలీసు ఆఫీసుకువెళ్ళి గడచిన పద్దెనిమిది మాసాల్లో నామీద ఏమేమి కంప్లయింట్లు ఉన్నాయ్యో చెప్పవలసిందని అడిగాను; నే నేమి చేస్తూవుంటినో వారికి తెలియదనీ, పార్టీ పనులు ఏమి చెయ్యకుండా పార్టీలో ఎలా వుండగలననీ, ఏమేమి చేస్తూ వుంటినో నన్నే చెప్పమనీ అడిగారు.

మా ఇంటిలో రాజకీయ తరగతులు నడుపుచుంటిననీ–బహిరంగసభలు పెట్టి చుంటిననీ చెప్పాను.

కాబట్టి, మిమ్ము ఎలా విడుదల చెయ్యడం?' అని తిరిగి నన్నే [ప్రశ్నించారు.

"ఈ మీటింగులకు, క్లాసులకు ముందుగా మీ ఉత్తరువు పొందుతున్నానని, తప్పు చేసివుంటే అది ఉభయులదీని; ఇద్దరం జైలులో ఉండాలిగదా!" అని సమాధానం చెప్పాను.

"ఉత్తరువు యిచ్చేటప్పుడు మేము తప్పు చేస్తున్నట్టు మాకు తెలియదే" అని నవ్వారు. ఏ షరతు లేకుండా విడుదల చేయవచ్చునని కాంగ్రెసు ప్రభుత్వానికి రికమెండు చేశారు.

విడుదల ఆర్డరు రాలేదు. జైలు మంత్రిగారిని కలుసుకొన్నాను.

"విడుదల చెయ్యండని ప్రధానికి వ్రాసిన అర్జీని చదివాను. మీరు కమ్యూనిస్టు పార్టీని వదలిపెట్టారు. కాని, మీ నమ్మకాలను (కన్విక్షన్సును) వదల్లేదని ఊహించాను. నా ఊహ నిజమేనా?" అని ప్రశ్నించారు మాధవన్ గారు.

"అవు"నన్నాను. "నేను పనిచేసిన గదర్ పార్టీ, కాంగ్రెసు, కమ్యూనిస్టుపార్టీల గొప్ప ఆశయాలలో నాకు నమ్మకం పోలేదు. కాని, ఆయా పార్టీల పంథాలలోను; కార్యక్రమాలలోను నాకు ఆక్షేపణలున్నాయి" అని అంటిని.

"మీరు ముసలితనమువల్ల, వ్యాధుల వల్ల రాజకీయాలు మానేశారు. మీ నిజాయితీ నాకు తెలుసు. మిమ్ము నమ్ముతాను. మన మిద్దరం చాలా కాలం జైలులో కలిసివున్నాము. మీ విడుదలకు తప్పకుండా రికమెండు చేస్తాను" అని స్నేహ పూర్వకంగా మాధవన్ గారు చెప్పారు.

"ఇప్పుడు పెరోలులో ఉన్నాను. ఇక జైలుకు పోదలచుకోలేదు" అని నవ్వాను.

"వెళ్ళనవసరం లేదులే! విడుదల అయ్యేవరకు పెరోలు యిస్తా"నని అలాగే చేశారు.

## ప్రధాని రెడ్డిగారు

కాని, ప్రధాని రెడ్డిగారి కటాక్షం వెంటనే లభించలేదు. ఆ షరతును, ఈ షరతును ఒప్పుకోవలసిందని నాకు కబురు పంపారు. ఎలాంటి కండిషనుకుగాని నేను సమ్మతించననీ, తిరిగి జైలుకు పంపవచ్చుననీ ఖండితంగా చెప్పేశాను.

"ఇకమీదట నేరంచేస్తే ఎలా"గని స్పెషల్ బ్రాంచి ఆఫీసరు అడిగారు.

"చట్టం ప్రకారం కేసు పెట్టుకోండి" అన్నాను.

జైలులో అనవసరంగా పది నెలలుంచి చివరకు 1949 జనవరి 21 తేదీన ప్రధాని రెడ్డిగారు దయతో విడుదల చేశారు. పోలీసు ఆఫీసర్లు న్యాయంగానే ప్రవర్తించారనుకుంటాను.

## ఎనిమిది జైళ్ళలో

ఇది సంధియుగం, గడచిన ముప్పయ్యారు సంవత్సరాల రాజకీయ జీవితంలో నాలుగుసార్లు జైళ్ళలో నిర్బంధించారు. రెండుసార్లు విదేశీ ప్రభువులు, రెండుసార్లు ప్రజాప్రభుత్వము మొత్తం ఎనిమిది జైళ్ళలో పెట్టగా ఎనిమిది సంవత్సరాల జీవితం గడిచిపోయింది.

1915-1919 నాలుగున్నర సంవత్సరాలు. (గదర్ పార్టీ సభ్యుడుగా)

1940-1942 రెండు సం॥ కొన్ని నెలలు.

1947 లో ఏడు నెలలు.

1948-49 లో పది నెలలు.

[illegible] [illegible] [illegible], [illegible] [illegible] [illegible], [illegible], [illegible] [illegible] ఉన్నాను.

సింగపూరు మిలిటరీ జైలులో ఆరు నెలలు ఏకాంతవాసం (సొలిటరీ ఇమ్‌ప్రిజన్‌మెంటు) వల్ల కలిగిన నరముల వ్యాధి (మ్యూరైటిస్ కార్డైటిస్) చే ఇప్పటికీ బాధపడుచేనాక, నా జీవితకాలమంతా కష్టపడక తప్పదు. కొన్ని పర్యాయములు చేతులలో, కాళ్ళలో, బూట్లులో, లాఠీలతో దెబ్బలు తిన్నాను. కొన్ని రోజులు నా బట్టలన్నీ తీసేశారు. ఎన్నో బాధలకు గురైందియీ నా శరీరం.

నేను కోరిన సంపూర్ణస్వరాజ్యం కాని, ప్రజాప్రభుత్వం కాని ఇంకా ఏర్పడనేలేదు. కాని, నా జీవిత కాలంలో ఏర్పడుతుందనే నమ్మకం నాకు ఇప్పటికీ దృఢంగానే ఉన్నది.

## ముగించే సమయంలో నా నమ్మకాలు

ఈ గ్రంథాన్ని ముగించే సమయం (1951–సెప్టెంబరు) లో నా ఆలోచనలు, నమ్మకాలు (కన్విక్షన్సు) యెలాగున్నాయని ప్రశ్నించుకున్నాను. చాలమంది మిత్రులు నన్ను ముఖ్యంగా కొన్ని ప్రశ్నలు అడుగుతూ వున్నారు.

"ఏ పార్టీ గెలుస్తుంది? కాంగ్రెస్సా, సోషలిస్టా, కమ్యూనిస్టా?" అని వారి ముఖ్య ప్రశ్న.

"ప్రజల సమస్యలను ఏ పార్టీ నిజాయితీగా పరిష్కరిస్తుందో ఆ పార్టీ గెలుస్తుం" దని నేను చెప్పిన సమాధానం.

"[illegible] [illegible]" [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] పండించాలి. పండించే కూలీ వానికే ఆ భూములకు స్వంతదారుడుగా చేసేవరకూ ఈ సమస్య పరిష్కారం కాజాలదని నా అభిప్రాయం. ఇది మన దేశానికి ప్రధాన సమస్య.

నిరుద్యోగసమస్య పరిష్కారం కావాలి. మధ్యతరగతి విద్యార్థులు తినుటకు తిండిలేక మాడిపోతున్నారు. వారు కార్మిక కర్షకులతో చేరి విప్లవం లేవదీస్తారు. ఆర్థికంగా ప్లానింగు లేకపోతే ఈ సమస్య సమస్యగానే వుంటుంది.

కమ్యూనిస్టులకు విప్లవ మార్గమూ, రక్తపాతమార్గమూ తప్ప శాంతి మార్గం లేదా? అనేది మరొక ముఖ్య ప్రశ్న.

పిచ్చివాళ్ళు తప్ప మరెవరూ దౌర్జన్యం చెయ్యరు. అయితే మంచి వారుకూడ కొన్ని సందర్భాలలో హింసామార్గం అవలంబిస్తారు. మహా ఋషులు, దైవావతారులు కూడా హింసా మార్గాలను ఒక్కొక్కప్పుడు బోధించారు; శాసనసభలద్వారా మెజారిటీ తీర్మానంతో పరిపాలన నిజాయితీగా జరుగనిస్తే ప్రజల కష్టాలన్నీ వెంటనే తీరకపోయినా, తీరగలవనే నమ్మకం ఏర్పడుతుంది; దానితో విప్లవాలు రాజాలవు. అందుచేతనే ఇంగ్లాండు, ఫ్రాన్సు, అమెరికా దేశాల్లో విప్లవాలు రావడం లేదు. ప్రజాప్రభుత్వా ల్లేని, రష్యా, చైనా, మలయా, బర్మా, ఇండోచైనా మొదలైన దేశాల్లో విప్లవాలు తప్పలేదు; తప్పవు.

ఏ దేశంలో నైతే కాన్‌స్టిట్యూషను (రాజ్యాంగ నిర్మాణాన్ని) సామాన్య మెజారిటీ వోట్ల ననుసరించి మార్చు కొనుటకు అవకాశం ఉంటుందో అలాంటి దేశాల్లో విప్లవాలకు అవకాశం చాల తక్కువ. ఇంగ్లాండు, ఫ్రాన్సు దేశాల కాన్‌స్టిట్యూషన్సు అలాంటివి; అమెరికా అలాంటిది కాదు. అయితే మనదో? .........

గాంధీగారి ఉద్యమం వల్లను, కాంగ్రెసు పోరాటాలవల్లను ప్రజలలో రాజకీయ చైతన్యం చాల ఉచ్ఛస్థితిలో నున్నది. అదొక అగ్నిపర్వతంలాంటిది. వాస్తవమైన ప్రజా ప్రభుత్వం ఒక్కటే దానిని శాంతింప చెయ్యగలదు.

పోలీసులు, సైనికులు మాత్రమే ఈ కాలంలో ప్రజలను అణచివెయ్య జాలరు. ప్రజలు ఎలాగో ఐక్యమవుతారు; నియంతల ఆటలను కట్టివేస్తారు. అలాగే కాదనే మూర్ఖ నాయకులూ వున్నారు. చియాంగ్‌కై షేకులు జయించేకాలం పోయింది.

## ఇకమీదట సాహిత్యసేవ

రాజకీయ రంగాల్లోనుండి విరమించు కొంటినిగదా! ఏ పనీపాటా లేకుండా కాలం గడపటం కష్టంగానే వున్నది. ఏదైనా సులభమైన పని చేస్తుండాలి.

ఇంకా నా చిరకాలవాంఛిత మొకటి నెరవేర్చలేదు. ప్రపంచ వాఙ్మయంలో నుండి వంద ఉత్కృష్ట గ్రంథాలను తెలుగులోకి తర్జుమా చేయించాలని యెన్నాళ్ళుగానో అనుకొంటున్నాను. ఆ విధంగా మన వాఙ్మయాన్ని సుసంపన్నం చెయ్యాలని నా అభిలాష. "హోం యూనివర్శిటీ లైబ్రరీ" "థింకర్స్ లైబ్రరీ"ల లాగా మన వాఙ్మయాన్ని సుసంపన్నం చేసి ప్రజలను సంస్కృతీ సంపన్నులుగను, అభ్యుదయ దేశాల ప్రజలతో సమానంగా ముందుకు నడవగలిగేటట్లున్నూ చేయవలె ననుకొన్నాను. మన భాష మాత్రమే తెలిసినవారికి ఇంగ్లీషు భాష తెలియదనే విచారం పోగొట్టుటకు ఇదే సులభ మార్గమని నాదృఢనమ్మకము.

1925–26 సంవత్సరంలో ఈ ప్రయత్నాన్నే గుంటూరులో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీ జి.వి. కృష్ణారావుగార్లతో కలిసి ప్రయత్నించి విఫలుడనైతిని. ఆకాలంలో తెలుగులో ఆలోచించి, తర్జుమా చెయ్యగలవారి సంఖ్య చాల అరుదు; చదువరుల సంఖ్యకూడా చాల తక్కువే. ఇప్పుడు అలా కాదు. తెలుగు భాష చాల అభివృద్ధి చెందినది. ఎన్నో భాషలలో ఆరితేరి తర్జుమా చెయ్యగలవారున్నారు. చదివేవారి సంఖ్య ముఖ్యంగా గ్రామాల్లో చాల పెరిగింది.

(ఇంకావుంది)

# సందేహం

ఒకమారు ఒకాయన ఆకాలపు సద్గురువు వద్ద కెళ్ళాడు. నాకు జ్ఞానోపదేశం చేయండని అడిగాడు. గురువుగారు అందుకు ఒక షరతు విధించాడు. "నేను ఇప్పుడు ఒకపని చేయబోతూ వున్నాను. నీవు ఏమీ మాట్లాడకుండా నిశ్శబ్దంగా చూస్తూ వుండాలి. నేను చేయబోయే పనిలో ఏమాత్రము జోక్యము కలుగజేసుకోకూడదు. నీవుగనుక నాపని అయినంత వరకు మౌనంగా వుంటే నీకు జ్ఞానోపదేశం చేస్తాను" అన్నాడు.

అప్పుడు ఆ వ్యక్తి అందుకొని "ఇందులో కష్టమేముందీ! నేను మౌనంగా చూస్తూ వుండడమేగదా! ఆ మాత్రం నేను చేయగలను"-అన్నాడు. లోలోపల చాలా సంతోషించాడు. మాట్లాడకుండా వుండడం తేలికేగదా! అనుకున్నాడు. నోటికి తాళం వేసుకొని గుట్టుగా వుంటే సరిపోతుంది. నా కోరిక నెరవేరుతుంది. నాకు జ్ఞానోపదేశం లభిస్తుంది. అనుకున్నాడు.

సద్గురువుగారు అతణ్ణి బయటికి తోడుక వెళ్ళాడు. "నీవు ఇదిగో ఇక్కడ నిలబడు. నన్ను చూస్తూ వుండి. నేను బావిలోనుండి నీళ్లు తోడబోతున్నాను". అని గురువుగారు బక్కెట్ తీసుకొని బావిలో వేశాడు. దాన్ని బయటికి లాగుతున్నాడు. ఆ బక్కెట్టు నిండా చిల్లులే. బక్కెట్టు నీళ్లతోనిండి పైకి వచ్చేలోపల మొత్తము నీళ్లు కారిపోయాయి. ఆ వ్యక్తి గురువుగారి వైపు చూస్తూ మనసులోనే గొనుక్కున్నాడు.

ఈ సమస్యలో వున్న కారణమేమంటే, ఆతడు నోరు తెరచి మాట్లాడకపోయినా, శబ్దము బయటికిరాకపోయినా, మనిషి కదలకుండా వున్నా అతడు మాట్లాడు తున్నట్లే లెక్క. అతని బుర్ర ఏమి చెబుతూవుందంటే, ఇది విచిత్రంగావుంది. . విడ్డూరంగావుంది. అయినా నాకేమి? నోరుమూసుకొని వుండడమే నాపనికదా! నేను అలాగే వున్నాను గదా! అనుకున్నాడు.

గురువుగారు మళ్ళీ బక్కెట్టును బావిలోకి దించారు. నీళ్లతో నిండగానే తోడుతూ వున్నారు. బక్కెట్టు బావిపై అంచువరకు వచ్చేసింది. ఖాళీ అయి పోయింది. ఇదంతా చూస్తూవున్న ఈ వ్యక్తి యొక్క బుర్ర క్రమక్రమంగా వేగం అందుకుంటూ వుంది. "ఏమిటీ మనిషి? విచిత్రంగా వున్నాడా! ఈయన సద్గురువు కావచ్చు. కాని ఒట్టి మూర్ఖుడిలా వున్నాడు".

గురవుగారు మళ్లీ బక్కెట్ బావిలోకి దించారు. దాన్నిపైకి లాగుతున్నాడు. తీరాపైకి వచ్చేలోపల అదేజరుగుతుంది. ఖాళీఅయిపోతుంది.

ఆ వ్యక్తి మనస్సులోనే అనుకుంటూ వున్నాడు. "నిజంగా నాకు జ్ఞానోపదేశం కావాలా? నా ఉద్దేశంలో ఈయన

అయినా ఈ బక్కెట్టుకు చిల్లులు వున్నాయన్న సంగతే ఎరుగడే! కనుక ఈయన చెప్పే జ్ఞానం ఏ పాటిదై వుంటుందీ? ఎందుకు పనికివస్తుందీ? అయినాసరే నేను మాత్రం నోరు మూసుకొని వుండాలేమో! బహుశా నా ఆలోచనలో పొరబాటు వుండవచ్చు గదా! కాబట్టి మాట్లాడకుండానే వుంటాను". గురువుగారు మళ్లీ బక్కెట్టు బావిలోకి దించాడు. పైకి లాగుతున్నాడు. మళ్లీ అలాగే నీళ్లన్నీ కారిపోయాయి.

ఈ వ్యక్తి ఇంక సహించలేక పోయాడు. జరిగిందే మళ్లీ మళ్లీ జరుగుతూ వుంది. సద్గురువు వేపు చూస్తూ "గురువుగారూ, మీరు ఈ బావిలోనుంచి నీళ్ల ఏమాత్రం తోడలేరు. ఎందువల్లనంటే మీ బక్కెట్టునిండా చిల్లులే" అన్నాడు.

వెంటనే గురువుగారు సమాధానం చెబుతూ "అయితే నీ బక్కెట్టు (బుర్ర) నిండాకూడా చిల్లులే. నీకు జ్ఞానోపదేశం కూడా లభించదు". అన్నాడు.

"నాకు జ్ఞానోపదేశం లభించకపోయినా పరవాలేదు. కాని బక్కెట్టు నిండా చిల్లులే వుంటే అందులో నీళ్ల బొత్తుగా నిలవవన్న మాత్రం కూడా మీకు తెలియదా"?

అందుకు గురువుగారు ఏమన్నాడంటే "అవును, నాకు తెలుసు. నాకు ఈ మాత్రం తెలుసు. కాని ఈ బక్కెట్టు (బుర్ర) రంధ్రాలతో నిండివున్నదన్న విషయం నీకు తెలుసునా? నేను చేస్తున్న పనిని మౌనంగా చూస్తూవుండమని మాత్రమే నీకు చెప్పాను. నీవు ఆ మాత్రం మౌనంగా చూస్తూ వుండలేకపోయావు. నీవు దాన్ని విమర్శిస్తూవచ్చావు. నీవు దాని అర్థాన్ని చెప్పావు. దాని సారాంశాన్ని చెప్పావు. దీని అర్థము ఇది అని నీవు చెప్పాలనుకున్నావు. కొంత తడవు ఇవన్నీ చెయ్యకుండా వుండమని నీకు నేను చెప్పాను. నీవు ఈ మాత్రం చేయలేకపోయావు".

అంతటితో ఆ వ్యక్తి తన తప్పును అంగీకరించాడు.

సరీగ్గా ఇలాగే అప్పుడప్పుడు మనముకూడా చేస్తూవుంటాము. సద్గురువు పట్ల మనము ఆచరించవలసిన కట్టుబాట్లను వదిలివేస్తూ వుంటాము. సృష్టికర్త ద్వారా, సద్గురువుద్వారా మనచుట్టు పట్ల వున్న ప్రజల ద్వారా లభించిన ఉపదేశాలన్నీ మనం పాటించాలి. లేకపోతే మన పరిస్థితి కూడా ఆ చిల్లుల బక్కెట్‌తో సమానమవుతుంది. ముందు మీపైన మీకు నమ్మకం వుంటే జ్ఞానం పైన నమ్మకం వుంటుంది. మీపైన మీకు నమ్మకం వుంటే సద్గురువుపైన కూడా నమ్మకం వుంటుంది. మీపైన మీకే సందేహం వుంటే సద్గురువు పైనకూడా సందేహం వస్తుంది. సద్గురువుపైన సందేహం కలిగిన వారికి జ్ఞానంపైనకూడా సందేహం కలుగుతుంది. అప్పుడు మీలోపలవున్న ఆ అనుభూతి పైన కూడా సందేహం కలుగుతుంది.

సేకరణ
గాదంశెట్టి శ్రీరాములు
గూడూరు.

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.8.1996 నుండి 20.9.1996 వరకు)

మీరు పంపవలసిన A-2 రిటర్నును చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి పంపుటకు సెప్టెంబరు నెల 20వ తేదీయే చివరిది. మీరు పంపు ఆ A-2 రిటర్నును చలానాతో బాటు కాకుండా, చెక్కుతో బాటు పంపాలను కుంటున్నారా? ఆ విధంగా ఆ A-2 రిటర్నును చెక్కుతోబాటు పంపుటను సెప్టెంబరు నెల 15వ తేదీ లోగా చేయాలి.

మీరు రు.1500/-లకు మించి ఆదాయపు పన్నును కట్టున్నారా? అయితే మీ అంచనా ఆదాయములో ఇరవై శాతము (20%). అడ్వాన్సు ట్యాక్సును (మొదటి కంతుగా) చెల్లించుటకు ఈ సెప్టెంబరు నెల 15వ తేదీయే చివరిది.

వ్యాపారరీత్యా కానీ, వృత్తిరీత్యా కానీ ఆదాయము గల అసెసీలు 1.4.1995వ తేదీతో ప్రారంభమై 31.3.1996వ తేదీతో ముగియు సంవత్సరమునకు సంబంధించిన తమ ఆదాయపు పన్ను రిటర్నును ఈ (ఆగస్టు) నెల 31వ తేదీలోగా అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చాలి.